# పీఠిక

ఆర్యులారా!

యీ చిన్న పొత్తంబున శ్రీ యుష్మాకక్షేత్ర మహాత్మ్యమంతయు సంక్షిప్తంబుగ వ్రాసినాడను. ఇందలి గాథ జగద్విదితమగు నదియే కాని ప్రమాణంబగు నేగ్రంథముం గాంచి వ్రాయఁబడినది కాదు. కాన నిందేమి పొరపాటులున్నను నన్ను క్షమింపఁగ ందులకుఁ బ్రార్థించుచున్నాడను.

నాయందు శిష్యవాత్సల్యముంచి యీగ్రంథమును సాంతముగాఁ బరిశీలించి నాసందేహములఁ బాపిన శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతి శతావధానులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీంద్రుల కనేక వందనంబులాచరించుచున్నాను.

ఈగ్రంథరచనకు, నాకత్యంత సహాయంబుఁ గావించి నన్నుఁ గృతార్థుఁ జేసిన శ్రీమాన్ శ్రీసకలగుణసంపన్నులయిన గొట్టుముక్కల లక్ష్మీనృసింహాచార్యులవారలకును, మ॥ రా॥ శ్రీ పుల్లగంగరాజుదొరవారికిని నా కృతజ్ఞతాంజలులు.

కాకినాడ
1-3-17

ఇట్లు విద్వజ్జన విధేయుఁడు,
గండికోట బాబూరావు.



ఓం

శ్రీ వేంకటేశ్వరాయనమః

# శ్రీయుష్మాకక్షేత్రమహాత్మ్యము.

శా. శ్రీయుష్మాకపురంబునన్ బరఁగుసు
క్షేత్రంబునన్ దాపసుల్
శ్రీయంబా భజనాళిసల్ప దివిజుల్
సేవింపఁజెన్నారనల్
చాయల్ దుందుభులెల్ల వేడ్క మొఱయన్
జ్ఞానోప్ప సద్భక్తిపో
షాయత్తుండగు వేంకటేశ్వరునినే
ప్రార్థింతునెల్లప్పుడున్.

వ. మునీంద్రులు భజనలుసేయఁగా దేవతలు గొల్వఁగా నాల్గుపక్కల భేరీమృదంగాది నాదంబులు మ్రోయఁగా శ్రీయుష్మాక యనఁబడు నుక్షేత్రంబున నొప్పు వేంకటేశ్వరు నెల్లప్పుడు

నేను ప్రార్థించెదను.

చ. వరుసగునాల్గువేదముల
♦ వంచనచేదనచెంతనుండిన
ద్వరముగదొంగిలించికడుఁ
♦ బాపముఁగొంగునఁగట్టుకొన్నయా
పరుషుని రాక్షసాధముని
♦ బాపినిఁగోపినిఁగూళసోమకా
సురునెట్టులైనఁగూల్ప మధు
సూధనువేడెనజుండుభక్తిమై.

తా. బ్రహ్మదేవుని నాల్గువేదములను దొంగి
లించుకొని పోయిన సోమకాసురునిఁ జంపుటకు
విష్ణుమూర్తిని బ్రహ్మవేడుకొనెను.

ఉ. వైదికమార్గముల్ నిలుపు
♦ వాఁడవు భక్తులఁబ్రోచువాఁడవే
డీ! దయఁజూపవే! పరమ
♦ దీనుఁడనామొఱనాలకించుదా
మోదర! దీనపోషణ! మ
♦ హోన్నత సద్గుణ! నన్నుగాచినీ
వేదరిఁజేర్చువాఁడవని
♦ యెంచితినిన్ను భజించితిన్హరీ!

తా. శ్రీహరీ ! నీవుభక్తులరక్షించు వాఁడవని
యు దీనులను బోషించువాఁడవనియు [illegible]
గొల్చుచున్నాను. కావున నన్నుఁగాపాడుము.

సీ. ఎండచేఁగదుడస్సి ♦ పండియుండిన
వానికమృతసరోవరం • బందినట్లు
చలిచేతవడఁకియు • చ్ఛ్వాసలూడిన
వానికరుణకిరణకర • మందినట్లు
లప్పలలోమున్గి ♦ యలసెడువానికిఁ
జుఱుకైనయొకతెప్ప • దొరకినట్లు
లాలుబిడ్డలపోష ♦ ణార్థమర్థవిహీను
చేతనిధానముల్ • చిక్కినట్లు

గీ. లాపదలుసంభవించిన ♦ యట్టివాని
కబ్జనాభ ! నీపదసేవ • యబ్బునెల్ల
నాదుపుణ్యావశంబునఁ , గంటిఁగాన
నన్నుఁబ్రోవంగదయ్య మో ♦ నళిననేత్ర!

తా. కష్టంబున నున్నవానికి నీయొక్కపాదము
లసేవ సంప్రాప్తంబగుట యెట్టిదనః నెండచే బడ
లికఁబడిన వానికి నమృతసరస్సు చిక్కినట్లును, చ
లిచేత మరణసన్నద్ధుఁడైనవానికి సూర్యకిరణమబ్బి
నట్లును, నీటిలోఁ బడికొట్టుకొనువానికిఁ దెప్పదొర

కినట్లును, నిఱుపేదకుని ధానములు గల్గునట్లులు నో ప్పను అట్టినీసేవను నాపుణ్యవశంబున గాంచి తిని గాననన్నుఁ గటాక్షింపుము.

చ. అనినుడువంగ విష్ణుఁడు మ
♦ హాముదమొంది "సెబాసు ! పుత్రి! నీ
మనమునఁగల్గు వాంఛలిక
♦ మానకొసంగెదవిమ్మనీవుచ
య్యనసరుదేరిరమ్మగను
♦ మ్మల్లవె ! బంధునరస్సునందు మ
జ్జనమొనరించినఁ దలఁచి
♦ చాలతపంబొనరింపుమప్పుడుఁ.

తా. అని బ్రహ్మవేడుకొనఁగా విష్ణుఁడు సంతసించినవాఁడై యాతనిని బంధు సరస్సునందు స్నానమాడి తపంబొనరింపుమనియు.

క. వచ్చెదనీతపమునకై
మెచ్చెదనటుపై నినీకు ♦ మేలెంచెదనే
నిచ్చెదనీకోరినవర
మచ్చెరువింకేల వెడలు♦మనుచుఁ బలికెఁ

క. అనిచెప్పిహయగ్రీవం
బునారసింహమునుమఱియు ♦ ముదములరంగా

ఘనమగుసప్తాక్షరియుఁ
మనమునఁబోధించిచెప్పె • మంత్రత్రయముఁ.
తా. అప్పుడు నేనువచ్చి నీవుకోరిన వరంబిచ్చెదనని, హయగ్రీవము, నారసింహము, సప్తాక్షరియనెడు మూడుమంత్రంబులు బ్రహ్మ కుపదేశించెను.

ఉ. అంతటఁబంకజాసనుఁ డ
• హా"యనిసత్వరతాభిగమ్యుఁడై
పంతముఁబట్టినట్టులల
• బంధుసరస్సును గాంచి వెంటనే
సంతస మొందె మజ్జనము
• సల్పియభీష్టములొంద నెంచియ
త్యంతసుభక్తిమార్గమున
• నచ్చటఁజేసెఁదపంబుశీఘ్రమై.

తా. అంతట నాబ్రహ్మ బంధుసరస్సునుగాంచి యందు స్నానంబుఁజేసి తత్తీరంబున మిగుల భక్తితోఁ దపంబుఁజేయుచుండెను.

చ॥ అటుచనెనేండ్లుఁబూండ్లుతుద
• కప్పుడునొక్కదినంబునందుఁదాఁ
బటుతరసంభ్రమంబొదవ

• బ్రహ్మను లెమ్మని యానతిచ్చి యా
కుటిలుని సోమకాసురునిఁ
• గూల్చెదనంచుఁ బ్రతిజ్ఞఁ బల్కి య
చ్చోటు విడి యేగెఁ దక్షణము
• చోద్యమెసంగ ముకుందుఁ డంతలో

తా. అంతఁ గొంతకాలమయిన తరువాత విష్ణుఁ డచ్చట సాక్షాత్కరించి బ్రహ్మకోరిక నెరవేర్తునని చెప్పి వెడలెను.

మ. కనులన్ విప్పి యజుండు వేగను మహా
• కాంతున్ నిజాగారమున్
గనియచ్చోటను నాల్గు వేదములనం
• తన్ గూర్మిలోఁ గాంచిన
మ్మనమం దెంతయు హర్ష మొందె నహా! యు
• ప్మాకే మహాక్షేత్రమం
చును దా జెన్ దనలోకమెల్లఁ బలువుర్
• సొంపార నాలింపఁగన్.

తా. పిదప నాబ్రహ్మ తనలోకంబున కేగి తన వేదంబుల నందుకొని సంతసించినవాఁడై యుప్మాకే గొప్పక్షేత్రమని యెల్లవారలకుఁ దెల్పెను.

చ. వడఁపడిఁ గశ్యపుం డుపలు

• భంగుల విష్ణునిఁ గొల్వఁబోయి "యో
సదమలచిత్త ! నాకయి యొ
• సంగుము కోరినకోర్కె నొందునీ
పదయుగ మొప్పదుర్ మఱచు
• వాఁడనుగా నుభవద్వ్యక్షేయుఁడన్
ముదమలరన్ గటాక్షమున
• బ్రోవుము నన్ని జెలోకరక్షకా!"

తా. తరువాతఁ గశ్యపుండుఁ గూడ విష్ణుని గుఱించి యనేకరీతులఁ బ్రార్థింపఁగా.

చ. అనుటయు నజ్ఞగిద్వారదుఁ
• డాద్విజపుంగవుఁ గాంచి నీవు కో
రినవరమద్భుతంబగు స
• రేయిటు సేయుము బంధుసాగరం
బున జలకంబుఁ సల్పి కదుఁ
• బూనికతోడఁ దపంబొనర్చినన్
ఘనముగు నీవరంబిడెద
• గ్రిక్కున బ్రాహ్మనియాన తిచ్చినన్

తా. ఓకశ్యపా ! నీవు బంధుసరస్సు నందు స్నానంబు సల్పి యచ్చట నన్గూర్చి తపమొనరించిన నేనచ్చట కరుఁడెంచి నీకోరిన కోర్కె నొసంగెద

నని చెప్పుటయు.

ఉత్సాహము.

పరమభక్తితోడనతఁడు • బంధుసాగరంబునఁ
బరఁగఁదానమాడుచుఁ ద • పంబుసేయుచున్నిరం
తరముమాధవున్ మనంబు • నఁ దలంచుచుండ శ్రీ
ధరుఁడువచ్చెనొక్కనాఁడు తాల్మిపుట్టవేగునఁ.

తా. అంతటఁ గశ్యపుండు బంధుసాగరంబున జలకమాడి విష్ణునిధ్యానింపఁగా నొక్కనాఁడాతఁడుఁ చోప్పటుకరుణించి.

తా. ఇట్లు సాక్షాత్కరించిన నారాయణునియెదుట నక్కశ్యపుండత్యంత వినయవిధేయతలతో ముకుళితాంజలుఁడై.

సీ. "దేవాదిదేవ! నీ • దివ్యపరిభావంబు
మెందుగాఁగనుట ధ • న్యుండనైతి
భక్తరక్షక! నీదు • పదధూళిసోకనే
నిండారనిరపావ • నుండనైతిఁ
నార్తపోషణ! నీకృ • పార్ద్రవీక్షణజాల
వృష్టిచేలోకగో • విదుఁడనైతిఁ
గరుణాలవాల! నీ • కాంచనాంబరమీను
రుచులచేజ్ఞానతం • తుండనైతిఁ

దృశ్యుఁడగుదువేక్ష్య • గశ్యవుంపు
చనినిజసతిఁగూడి • సరగునఁగేశవుఁ
బోలునొక్క ముద్దు • పుత్రుఁగనియె.

తా. అందులకు మాధవుండు సరేయని యదృశ్యుఁడగుటయుఁ గశ్యపుండు నిజస్థానంబునకరిగి తనకోరికప్రకారమువిష్ణుమూర్తింబోలు నొక్కకుమారుంగాంచెను.

మ. అతఁడేపిమ్మటవామనాఖ్యుఁడయిలో
• కైకప్రపూజ్యాఁడునై
యతిసూక్ష్మండుఁ ద్రివిక్రముండునయిరయొ
• ప్పారెంభళీ! యిట్టిక్షే
త్రతటాకంబుననీ ధరాధరము చెం
• తన్గల్గుభూరివ్రభా
తతులన్ మన్నతిసేయఁగానలవిగా
• ధాతాదిదేవాళికిన్.

తా. ఆజన్మించిన శిశువే త్రైలోక వామనమూర్తి యయి యెల్లరచేఁ బూజితుండయిన మహాత్ముఁడు. కాబట్టి యిట్టిక్షేత్రమహిమను బొగడుటకు బ్రహ్మాదిదేవతలకైన శక్యముగాదు.

ఉ. లోకములెల్లఁగుక్ష్మిటము

• లోయన రేయిఁబవళ్ళుబిగ్గను
ప్మాకయెగొప్పక్షేత్రమని
• మాటికిమాటికిఁగూయుచుండఁగా
మూకలుగానుగుప్పలుగ
• ముచ్చటనొందుచు నెల్లవారలా
హా ! కనుఁగొందమంచుఁగని
• యచ్చెరువొందుచునుండిరంతలో

తా. ఉప్మాకయే మహాక్షేత్రమని లోకము లన్నియు విస్తారముగాఁ జెప్పుకొనుచుండుటఁ జేత ననేకులు వచ్చి యామహిమంగని యాశ్చర్యపడు చుండఁగా.

సీ. ఖగకులేంద్రుఁడుఁగూడఁ • గనుఁగొనం
బుత్తెంచిసాగరంబునుగాంచిసంభ్రమంది
నగుక్షేత్రమనియెంచి• కాసంబుసేసిమాధవుఁ
గూర్చిఘోరమా • తపమొనర్చి
భావంబున్ దలచి • పలుభంగులన్ దేవదేవుని
బ్రార్థింప • దివ్యముగను
సుముహూర్తమునమధు • నాథనుండాకస్మి
కముగనాతనికి సా • క్షాత్కరించి
గీ. ''మెచ్చినాదనీతపమున • కిచ్చెదనిక

నీవు కోరినవరము నం • దియము లేదా
టంచు బల్కినగరుడుండు • హర్షమొంది
యంబుజాక్షునియెదుటను • బ్రాంజలుండయి

తా. గరుత్మంతుఁడుగూడ నీక్షేత్రమహిమంబుఁగాంచనేతెంచి దయాబంధుసాగరంబున స్నానమాచరించి ఘోరతపంబుసేయఁగా లక్ష్మీమనోహరుండాతని కట్టెదుట సాక్షాత్కరించి "నీతపంబునకుఁజాలమెచ్చితిని నీమనోరథంబుఁదెల్పు" మనుటయు నందులకు గరుడుండు చేతులంజోడించి

ఉ. "నిరతంబుగా భవదీయపాదయుగళిన్
• జేపట్టియున్నాఁడనన్
గరుణన్ బాలనుముంచినన్ సరియె, ముం
• దర్ నీటిలో ముంచినన్
సరియే కోరికయొండునాకుఁగలదో
• శౌరి ! ప్రసాదింపునా
వరపక్షద్వయమందు నెల్లపుడు నం
• వాసంబుగానుండుమా."

తా. సర్వేశ్వరా ! యెల్లప్పుడు నీపాదంబులనమ్మియున్నాఁడను. నీకృపాపాత్రుఁడనుగాన నెప్పుడును నీవు నాతెక్కలపై నధిష్ఠించియుండుటకుఁ

గాఁ బోఁపుచున్నాఁడను.

శా. ఆంచత్ బర్బ్యాసనఁ గాంచనాంబరుఁడుమే
• ఘాంచత్ కీరంబూఁచి బో
ధించెన్ "పక్షికులాగ్రగణ్యా ! యిదె! దే
• వెంతున్ సతిన్ గూడినీ
కించన్ మానుముఘోటకంబుపయిర
• క్షిన్ వత్తునిచ్చోటు రా
జించున్ క్షేత్రముగాఁగ నెల్లరకుని
న్నీ" యంచుఁదానేగినన్.

తా. అని గరుత్మంతుఁడు పల్కఁగా విష్ణుఁడా తనిమాటల నాలించి "పక్షికులావతంసమా! నీవుకోరిన వరంబొసంగితిని. నేనిప్పుడుపోయి వెంటనే లక్ష్మితోఁగూడ గుఱ్ఱముపై నెక్కి యిచ్చటకు వచ్చెదను. ఈస్థలము దివ్యక్షేత్రంబగు" నని నుడివనియె.

గీ. కృతయుగమునబంగరుకొండ • క్రియగరుడుఁడు
దనరెరజితాద్రిమాడ్కిఁద్రేతాయుగమునఁ
దామ్రమయమయినట్టులు • ద్వాపరమునఁ
గలియుగమునఁబాషాణంబు • కరణిమిగుల

తా. అట్లుచ్చట గరుత్మంతుఁడు దేవుని రాక

కయి కృతయుగంబున బంగారుకొండరూపంబునను త్రేతాయుగంబున వెండికొండ యాకారము గను ద్వాపరంబున తామ్రపర్వతముమాడ్కిని గలియుగంబునఁ బాషాణంబు విధంబున నచ్చోటనుఁగాచుకొనియుండె.

చ. పివపముదాఁ వేడ్కనెయిఁ
• బ్రియసిశ్రీసతితోడఁగూడి స
మ్ముదమున వేటమార్గముఁ బో
• వుచు శ్వేతహయంబునెక్కి సొం
పొదవఁగఁగొండరూపము న
• నుండినయాఖగనాథుమీఁదఁ దా
సదయమనంబునఁ గానించి
• సన్నుతిసేయఁగనెల్ల దేవతల్

తే. గీ. అచటఖగరూపమునన్న • యట్టిరొల్ల
మునివరేణ్యులకప్పుడు • మోదమిచ్చి
శైలుమేలనిగరుడుని • మెచ్చుకొనుచు
క్షేత్రమధ్యంబునకుదయ • సేసె నెలమి.

శా. తరువాత విష్ణుండొకనాఁడు వేటమార్గంబున లక్ష్మిసమేతుఁడయి శ్వేతాశ్వమునెక్కి వచ్చుచు నచ్చోఁ గొండరూపంబు ధరించిన గరుత్మం

తునిపై నధిష్ఠించి యచ్చోటఁ దపంబులు సల్పు చుండిన మునివరుల కెల్లరకు మోక్షంబొసంగి యా క్షేత్రమధ్యభాగంబునకు వేంచేసెను.

తదనంతరమున—

ఉ. నారదమౌనిచంద్రుఁడు ఘ
• నంబగు క్షేత్రములెల్లఁగాంచి సం
చారముఁ జేసి యొక్కెడ దివ
• సంబున బంధుపతస్సుఁ జూడఁగా
నోర్కిఁగలిగి వచ్చియట
• కుర్కనులారఁగ నెల్లవింతలన్
మీరిన భక్తితోఁ గనిని
• మీలితలోచనుఁడౌచు నాత్మలో

తా. పిమ్మట నొకరోజున నారదుఁడు సకలది వ్యక్షేత్రంబులు సేవించి తన్మార్గంబున నీబంధునర స్సుంగాంచఁ గుతూహలుండయి వచ్చి యిం దుంగల యెల్లవింతలనరసి సర్వేశ్వరుంగూర్చియు నక్షేత్రమహాత్వంబుఁగూర్చియు నాత్మలో

సీ. పంకజాసనుఁడుమున్ • బరమభక్తి నిక్షుఁ
గూర్చి తపముఁ జేసి • కోరినట్టు
దేవతారాధ్యుఁ డౌ • దివ్యసుధారాంబుగతి

పుండువరంబు ♦ గనిన చోటు
ఖగకులేంద్రుఁడునగా ♦ కారంబుదాల్చి
శ్రీపతిఁ బైనిడుకొని ♦ పరఁగు చోటు
మునివరుల్ పలుతపం ♦ బులొనర్చి సంకల్ప
సిద్ధులై మోక్షంబుఁ ♦ జెందు చోటు
గీ. ననుపమానదివ్యప్రభా ♦ వాతిశయము-
తోడ సంతతంబునుదులఁ ♦ దూగు చోటు
నిట్టి యుప్మాకసుక్షేత్ర ♦ మించుకైన
నలవియగునొక్క వర్ణింప ♦ నలువకైన

తా. బ్రహ్మ విష్ణునిఁగూర్చి భక్తితోఁ దపముఁ జేసిన చోటును, దేవతలచేతఁ బూజింపఁబడునట్టి కశ్యపుఁడు విష్ణునిచే వరంబుఁ బొందినస్థలమును, గరుత్మంతుఁడు గొంపరూపంబుఁదాల్చి మాధవుని తనమీఁదనుంచుకొన్నతావును, ననేకఋషులు ఘోరతపంబులాచరించి మోక్షముంగనిన నీదుయు సాటిలేనటువంటి మహాత్మ్యంబుఁగల ప్రదేశంబునునగు నిట్టి యుప్మాక మహాక్షేత్రముయొక్క మాహాత్మ్యంబు నెంచుటకు బ్రహ్మదేవునికైనను శక్యముకానేరదు.

మ. అనుచున్ మెచ్చు మనమ్మునీంద్రుఁ డటస్నా

నాథుల్ వడిఁ బిల్చి, విష్ణుని సేవింపఁగంబు నెక్కి-
కరముల్ • జోడించి సద్భక్తిఁ గీర్తనలం బాడుచుని
ష్ఠ నొక్కసుముహూ • ర్తంబందు సద్బ్రతిష్ఠను జే
సెన్ సీతతో • వాహనముతో • డన్ వెల్గు నద్దేవునిన్.

తా. అట్టులా శ్రీగర్భంబున సన్నుతించుచు నొకసు
ముహూర్తంబున విష్ణుని, లక్ష్మీసహాయ సహితం
బుగాఁ బ్రతిష్ఠ యొనరించెను.

ఉ॥ చాలదినంబు లైన తరి • స్వామియొకానొక
నాఁడుకొండపై నాలనుగాచువానికల • యందునఁ
గన్పడి తట్టిలేపి "గో। పాలక ! వేటమార్గమున •
వచ్చితి మిచ్చటికే నులచ్ఛియున్। మేలగునీకు" నంచు
ను జ • నెన్ మహనాఁడు గొల్లఁ డెంతయున్॥

తా॥ కొన్నిదినంబులయిన పిదప నొకదినమున
నారాయణుండొక గొల్లవాని స్వప్నంబునకరుదెం
చి వేటమార్గమున లక్ష్మితోఁ గూడఁ దానచ్చటకు
విచ్చేసితినని చెప్పఁగా నాగోపాలుఁడు తత్క్షణంబున నె

ఉ. అబ్బురమంది చిత్తమున • యానగమంత
యుఁ గాంచి నొక్కచో। గొబ్బునఁ జూచి యాహ
కుక • కుంఠిత తేజు, యశోవిహారు నొ[illegible] యు
టంచు వెంటనె జో • హారొనరించి గ్న[illegible]ముఖుం

